# పంచవటి

(ఖండ కావ్యము)

శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు



ప్రచురణ :

ఎ. వి. రాం అండ్ కో, నర్సాపురం.

సోల్ సెల్లింగు ఏజంట్సు :

ప్రభాత్ అండ్ కో., పాలకొల్లు, బెజవాడ.

బుక్ సెల్లర్సు అండ్ స్టేషనర్సు.

వెల రు. 0—12—0

# పితృస్మరణ

భువనికి నిలువేల్పు నవవర్ష జలధర
శ్యామసుందరుఁడు శ్రీరామచంద్రుఁ
డెంత క్రోలినఁ దృప్తియే కొల్వ దేవనికిఁ
దారక బ్రహ్మగాంధర్వగీతి
అఖిలాండకోటి బ్రహ్మాండ మెవ్వని కను
పాపలోపలి పసిపాప యయ్యెఁ
గరగె నెవ్వఁడు చంద్రకాంతమట్లు దినమ్ము
రామాయణమ్ము పారాయణమున
నా యశఃకాయు పితృశంకరాభిధేయు
భవ్య మూర్తియె నా దృష్టిపథమునందు
ద్యోతిలుత దివ్యమంగళజ్యోతి యగుచుఁ
బరమపావన శీతల ప్రభలతోడ !

# కవి ప్రశంస

నృత్య సరస్వతీ కటక నిక్వణముం బ్రకటించుకొంచు సా
హిత్య సరస్వతీ హృదయ మిచ్చుచు గానసరస్వతింబలెన్
సత్య పదార్థ కీర్తనము సల్పెదు మత్కవితా సరస్వతీ
నిత్యత చాలు, స్వర్గమును నీరస మీ రససిద్ధిముందటన్.

మోదములోన మోదమయి పోదురు, ఖేదములోన ఖేదమై
పోదురు, సర్వముం గరగిపోవును వారలదృష్టి, వారి యా
హ్లాదవినోదముల్ కడు విలక్షణముల్, కవులన్న సత్య సూ
ర్యోదయకాల మానససరోవరహంసఁటుల్ రసప్రియుల్.

# కవి ప్రశంస

మా నవఖండ మండల సమన్విత రాజ్యము శాస్త్రవేదమున్
మానవశాస్త్ర మన్నదె ప్రమాణము లీపరిపాలనం బొకిం
తేని యెఱుంగరాని దొక హృద్గతభావనకాని దాననే
కానఁగవచ్చు మా రసజగద్వ్యవహార సమస్త శాఖలున్.

ఖిన్నతనేని తీపి గలిగించి దరిద్రుని భాగ్యవంతునిన్
భిన్నతలేని మార్గమునఁ బెట్టు కవీశ్వరు రాజ్యమందుఁ దై
కొన్నకొలంది నెల్లరకుఁ గొల్లరసానుభవంబు, రండు మీ
పున్నము పండివచ్చినది భోక్తలుగందు రసజ్ఞ శేఖరుల్.

ఆదిన్ మాదు రసప్రపంచము రసాలాకారతం జెందఁగా
స్వాధిష్ఠానముగాఁగఁజేసి కవితాశాఖన్ సుధామాధురిన్
నాదంబున్ వెడలింపఁడే ప్రణవఘంటంబోలి రామాయణ
ప్రాదుర్భావ వసంత కోకిలముగా వాల్మీకి సుశ్లోకియై.

కరగించున్ శిలనైన మాదు కవితాగంధర్వసంగీత కి
న్నరకంఠస్వర దేవతాహృదయసౌంద ర్యాప్సరోనృత్య సి
ద్ధరసాస్వాదన నిత్యనూతన మహోద్య ద్రాజ్యలక్ష్మీమధురం
ధర విద్యాధర చక్రవర్తి యదుగో! నక్షత్రలోకమ్మునన్.

ఆ విద్యాధరితో సువర్ణమయపీఠాసీనుఁడై యల్ల స్వే
చ్ఛావాతావరణంపు భోజసురభూజచ్ఛాయఁ గొల్వుండనే
యావాడే కవికాళిదాసరసరజ్యద్రాజరాజేశ్వరుం
డావాల్లభ్యరసప్రపంచములకే యైక్యానుసంధానముల్.

# రామదూత

ఇదిగో! నీవు నిమిత్తమాత్రు; డగుమీ, యేనే సుమీ నిర్వహిం
చెద రామాయణమున్ సమస్తమును, నీ జిహ్వాస్థలిన్ నిల్చెదన్
పద స్వగ్రామకుటీరవాసమునకున్, భావింప నేమాత్రమున్
హృదయస్వాస్థ్య మటన్న దే కుదురదో దీ పట్నవాసంబులన్.

పెడకుం బట్టినబుద్ధి త్రిప్పుకొను మబ్బీ! యెవ్వఁడే గంగలోఁ
బడ నీకేమిర! చూచుకొమ్ము తరణోపాయమ్ము! సంసారమున్
గడుపన్ నే ననువాఁడ లే నటర, నీ గగ్గోలె కానీ! యికం
గడికే యొక్కొక నీదుకైత భగవత్ కైంకర్యమౌగావుతన్!

ఉదయము పార్థివంబు వలయున్, ధ్వనియించి ధ్వసించిపోవలెన్
హృదయము రామనామమున, నెల్లపుడున్ స్తుతిపాఠమన్నదే
యుదరనిమిత్తమై సలుపకుండ వలెన్, బరమోపశాంతి నె
మ్మది కవితాసమాధిన నిమగ్నముగావలయున్ గృతిక్రియన్.

అతిపరమప్రశాంతహృదయమ్మున బ్రాహ్మముహూర్తమందు ని
ష్కృతికి నుపక్రమించుటయు తేవకడన్ విరమించుచుండుటన్
బ్రతిదినమందు నీవు పరిపాటి నొనర్చి రచించుటం దనా
హతమునఁ గర్ణికాగ్రమున హంసను స్తంభన చేయఁగావలెన్.

అపు డాబ్రాహ్మముహూర్తమందె యుదిగో! యీజానకీరామచంద్ర పరబ్రహ్మము వాయురూపిగ జగత్ సంచారముం జేసి తూరుపు రేకల్ తెలవారు నావల కొనర్చున్ సుప్రబోధంబు ప్రాణివయిన్ బ్రాణివయిన్ దదీయకృపఁగంటె యెంతయుద్గాథమో!

స్థాయి పారిజాతతరుమూలమున నాకు,
హాయి రామచింతనామృతమును,
నార్తి గలిగి భక్తు లనుకొంటయే చాలు,
వచ్చి గంతుమీఁద వ్రాలుచుందు.

వేయు నేటికి మా రామవిభునివంటి
శ్యామసుందరమదనమోహనుఁడు లేఁడు !
అమ్మహాధర్మమేను నామమ్మె చాలు
త్రిభువనమ్ములు మోహముద్రితము లగును.

నారద నీ కొకింత యుయునన్ గనవచ్చెన కోఁతిరూపు ? నా యాకృతియందు దానిపాడ యైనను లేనిదె కోఁతి నంచు వాల్మీకి లిఖింపఁ గారణము లేదు మతేమిగుణునేని భక్తికి నేరడ రామదూత నని యే నొకతోఁక దగిల్చికొంటయే.

ఎవఁడుర కోతి నే నఁటర ? యీశ్వరతేజమునన్ జనించి విష్ణువె హృదయంబుగాఁ గల మనోజవమారుతతుల్యవేగుడన్ నవమదనాభిరాముఁడను, నవ్వగు విన్నకొలందిఁ గోఁతి నే యవునెడ నాదుపేర నెటు లయ్యెను సుందరకాండ మట్టులన్!

స్వాదువులౌ ఫలంబులను స్వచ్ఛము లైన జలంబులన్ మితా
స్వాదన చేసి చేసి తుది వాయువె భక్షణముం బొనర్చి వ్యా
సాదులు మున్ను హంసగమనాగమనమ్ము లెఱింగి యింద్రియో
న్మాద మడంచియే కవనమార్గముఁ బట్టిరిరా కుమారకా !

నాదసుధన్ గ్రహోపశమనమ్మయి పోయినయట్టి క్షుత్పిపా
సాదులతో శతాబ్దులు శతాబ్దులు యోగసమాధి నుండి ము
న్నాదిఋషీశ్వరుల్ ప్రకృతి కావల నిల్చి త్రికాలవేదులై
యేది ధ్వనింపఁజేసి రదె యీశ్వరవాణి సుమా కుమారకా !

స్థాయి కుదుర్చుకొమ్ముభయసంధ్యలలో దినమున్ దినమ్ము గం
గా యమునా సరస్వతుల గానసుధారసధారచేఁ బ్రతి
స్నాయువు నంటికట్టు మలినమ్ములను క్షాళనఁ జేసికొమ్ము రా
మాయణనిర్వికల్పకసమాధికి నే సమయమ్ముఁ జూచెదన్.

ఈ మహనీయయత్నము ఫలింపఁగ సర్వసుపర్వమౌళిమా
లామణిచక్రచుంబితము లక్ష్మణదేవసమేతజానకీ
రామపదాబ్జపావనపరాగము మౌళి నలంకరించి ని
వీమయి మానసముద్ర వహింపుమిదే నిను నావహించెదన్.

పావన మా సహస్రదళపద్మసువర్ణమయాలయంబులో
శ్రీవరుఁడైన రాఘవుఁడు చిన్మయుఁడై వెలుగొందుచుండ నీ
జీవనపుణ్యతీర్థమున శీఘ్రము క్రుంకిడి దాటిపొమ్ము మా
యావరణమ్ము, నామకుసుమార్చనవేళ యతిక్రమించెదన్.

పోతనకన్నఁ బండితకవుల్ గల రెందఱో నాఁడు నేఁడు త
ద్రీతిఁ గవిత్వముల్ నడిపిరే తెనుఁగందున నెవ్వరేనియున్ ?
హేతువ దేమొ గుర్తెఱుఁగు మింతటి మేటికవిత్వమేని స్వ
జ్యోతి బహిర్గతం బగుట చొప్పడకున్న నిరర్థకం బగున్.

నీ వాఘ్రాణమవో త్వగింద్రియమవో నేత్రంబవో జిహ్వవో
కా వల్లె శ్రవణంబవేని మఱి యాకాశంబవో భూమివో
కా వట్లగ్నివయో సువాయువవునుం గా వింక నే మౌదువో
భావింపంగద వోయి రాఘవపరబ్రహ్మైక్యసంధానకా !

లే వన్నొంటను ద్వేషరాగములు చెల్లే లోభమోహాస్త్రముల్
దా వేశార్థధనాభిమదమ్ములరు మాత్సర్యమ్ములున్ వర్గముల్
గా వీ వర్ణము కామమోక్షములనుం గా వింక నే మౌదువో
భావింపంగద వోయి రాఘవపరబ్రహ్మైక్యసంధానకా !

లే దే మాత్రము మృత్యుశంకయుని యుల్లే జాతిభేదం బనన్
రా దట్టే తలిదండ్రు లెన్నఁడయునుఁ దీరా జన్మమే నష్టిదై
నీ దస్తిట్టిదె లేక యాత్మ యొకఁడే నిత్యాత్మదీపాంకురం
ప్రాపింప్యంబనుఁ జెంపు రాఘవపరబ్రహ్మైక్యసంధానకా.

# పంచవటి

ఏవిరెూ లీలల నేల చూపెదవు మే మింకేమియుఁ గోర మిం
క్కడ నేదీ యొకసారి చూడఁగదె యీ గోదావరీతీరపం
చవటీపర్ణకుటీరవాసముని వేషం బేకపత్నీవ్రత
స్తవనీయమ్ముఁ బ్రసన్నరాఘవము సీతాలక్ష్మణోపేతముల్ !

ఎవ రా పుణ్యతపోవనాంతరములో నేకాంతవాసమ్మునన్
లవలీపల్లవశయ్యపై ? నతఁడు లీలామానుషుం డైన రా
ఘవుఁడేనా ? మఱి యెవ్వ రా వరస? సాక్షాదాదిలక్ష్మ్యంశసం
భవ యా భూసుత సీతయా? శత మివే భక్తిప్రపూర్ణాంజలుల్!

అవ్వఁ గానీ మన లక్ష్మణుం డిచట ? శయ్యాకల్పనానంతరం
బవలం బోయెనె పత్రపుష్పఫలతోయార్థంబు వేఱేఁడు లా
యువురా లక్ష్మణ నీకు! మాట యనుకొంచుండంగ నే వచ్చినాఁ
డవురా! యెన్ని ఫలంబులన్ గుడువఁబెట్టన్ దెచ్చియున్నావురా!

మదురంగఁ బండుకండులను మాపునుతేపును దెచ్చియున్నరున్
వదినకుఁ జేతికిచ్చెదవు, వారిది భుక్తియు నిది తృప్తియున్
క్షుధ యెటుఁ బోయెఁ బండె రుచిచూడ వహో! జలమేని గ్రోలకే
బ్రదుకఁగ వచ్చునే పవనపారణమాత్రముతోన లక్ష్మణా !

ఎటు శమియించుచున్నది జ్వలింపక లో జఠరాగ్ని వాయు వే
మిటో యటు భుక్తిగాఁ బరిణమించి క్షుధన్ సుధ జేయు టేమిటో
ఇటు లొనరింప శేషఫణికీ వవతారము వోటఁ జెల్లె నం
తటిఘనమైన దీ యఘటనాఘటనాపటిమంబు లక్ష్మణా !

స్థిరతరం బైన యోగసంసిద్ధిఁ జేసి
చిత్తమే క్షీరసాగరస్థితి వహింపఁ
బాలకరగల నాలీలఁ గ్రోలు నీకు
నీఫలజలంబు లెటు రుచియించుఁ దండ్రి !

అడవిని గ్రొత్తగ్రొత్త లయినట్టి ఫలంబులు దెచ్చి చేతి కి
చ్చెదు నప్డు దెల్లఁ దద్రుచివిశేషము లీ వెఱఁగించుచుంట సా
వడి కొనితెత్తు నీ వనుచు భ్రాంతి వహింపర మేని యంతప్రే
ముడిగలయన్నయున్ వదినెయుట్టుదురే ఫలము కొఱకుఁ జేనియున్?

చూచుచునున్నయట్లు వినుచున్ వినుచున్నటు చూచు నీవు మూ
చూచుముననే ఫలంబుల రుచుల్ గ్రహియింతువు ... కాలపై
వైచుట కాదు, కేవలము నాసికి నీ వనుమాట నాకిఁకన్
దోచదు మానుషత్వమున దోఁగిన హేతువుచేత లక్ష్మణా!

వలపున కచ్చమున్ మొగలివంటిది నీచెలి, నీవు భోగిమం
డలమకుటాయమానుఁడవు, నైజముగా నవకామయౌవనో
జ్జ్వలత క్షణక్షణంబును బొసంగును నాగకులమ్ము; కొట్లు రాఁ
గలిగితి చుట్టవేసుక సుఖంబుగ బొద్దులు పుచ్చుకుండఁగన్.

పదముల వంటి వేడడిని పాపము నీ వెనువెంట రాఁగ మా
వదినకుఁ దోడుతోడు వనవాస మొనర్చును లెమ్ము లక్ష్మణా!
ముదలరొయనంగు మంచునుబ్రపూజ్య సుమిత్రయనంగ నాఁడు నీ
హృదినెఱిఁగింక వాఙ్మ్గా! హృదయేశ్వరియూర్మిళికంబు వాయఁగన్.

వల దనువాఁడ నావసనివాసముకుం గొనిపోవఁగాఁ గుతూ
హల మది లేకనా? జనకు లా గురుపాదులు పేరుఁ బెట్టి రూ
ర్మిళ యని, నీ కనాగత మెఱింగిన యంత మహర్షి వాక్కు ని
ష్ఫల మగునే పరస్పరముఁ బాయుట తప్పని చెప్పు దెట్టులన్.

జనకునియాజ్ఞచే వనికి సాగఁగ నుండిన యట్టి నేను నీ
జనకుని యాశయమ్మున కసమ్మతి నూను టసంగతంబు; తో
డన గొనిపోదు ప్రాణమిచటన్ బడియుండు శరీరమంచుఁ దె
ల్పినవయిఁ గాదె నిన్నడుగు వేయగ నిచ్చినదాన లక్ష్మణా!

ఎటనో యున్న దయోధ్య, యందున్నను నీయిల్లాలు, నీవుంటి వి
య్యటవిన్ బంచవటీ శిలాతలమునం, దా నేమి యేకత్ర యు
న్నటులే కా సతి యోగనిద్రను త్వదీయాత్మానుసంధానతన్
ఘటముల్ దూరములైన నేమి మతు లొక్కండైన నంతర్ముఖా!

అణుమాత్ర చ్యుతిలేని యోగమున నిత్యస్వచ్ఛ మాణిక్య ద
ర్పణమా నీహృదయంబులోఁ బ్రతిఫలింపన్ నిన్నున్ నే నను
క్షణముం జూచుట లేదొ, యాయమయునిశ్వాసోర్మిరూపంబె ల
క్ష్మణ, కైసేయదొ నీకు నామనువియోగంబాట యింకెట్టులో?

ఆనాఁడో శర్కరయాక చేతి కిడగా నాయన్న యీపర్ణశా
లానిర్మాణ మొనర్చినాఁడ, వొక వేళన్ నిద్దురం జేసి తే
యేనాఁ డట్టినిశీథమం దయినఁ దండ్రీ లక్ష్మణా! యట్టె యీ
సీనుం డయ్యెద వల్ల ప్రాంగణశిలాసింహాసనంబందునన్.

అమితప్రోజ్జ్వలమైన నీయమృతదేహచ్ఛాయ యీయంధకా
రమునన్ సైతము దృక్పథంబును సువర్ణస్నాన మాడించెదున్
సుమనోజ్ఞం బగు నీస్వరూప మటులే చూడంగఁ జూడంగ ని
ర్నిమిషంబై నయనద్వయంబును మనోనేత్రంబు విప్పారెడిన్.

ఏ వ్యావృత్తి గనుంగొంట లేక నిరతం బీదైవసృష్టిక్రియా
కావ్యగ్రంథమునే పఠింపుచు నసున్ గంభీరశైలాళి మా
నవ్యాఖ్యల్ పరికించి చూచు మునిబృందం బంతరార్థం బిటన్
సువ్యక్తంబు భవన్ముఖంబున నొనర్చున్ భాష్యకారప్రభూ!

నీ వా యన్నయు నివ్వనిన్ వెడలినన్ మీ యశ్వినీదేవతా
లావణ్యాధికరామణీయకతనూలాలిత్యముం గ్రోలఁగా
మీ వెంటం బడి దేహభాన మస లేమీ లేకయే వచ్చి మీ
భావైక్యంబునఁ జొక్కుటే యిచట జీవన్ముక్తి ఋష్యాళికిన్.

అఖిలార్థకామ సమన్వయ ప్రాపిత
పరమ స్వధర్మనిర్వహణచణులు
ఆలోక్యమాన పిపీలికాదిబ్రహ్మ
పర్యంత తుల్య స్వభావ రమ్యు
లుపనిష త్పుణ్య పీయూష పాన విశేష
దినదిన నవనవోత్తేజితాత్మ
లాజ్ఞానిరీక్షక హంసవాహన దహ
రాకాశ వీధీ విహారదృష్టు

లత్యాధిక పంచవర్ణమయ ప్రభూత
చిత్రకళామంది రాంతర జీవ దేవ
నిరతి సుఖ లోలు రతిపూజనీయు లైన
మానులు గదయ్య! మీ శ్రోత్రమండలంబు.

అత్ర్యాది సప్తమహాఋషుల్ వారిత
చ్చరణసంస్పర్శయె స్పర్శవేధి
అతఁడె యాపస్తంబుఁ డావృత్తచక్షువు
కేవల బ్రహ్మపదావలంబి
యా నారదుఁడు తురీయాతీతుఁ డాకాశ
గమన దూరశ్రవణముల వాఁడు
ఆవలి జాబాలి యత్యద్భుతావహ పర
కాయ ప్రవేశలాఘవము గలఁడు

సంయములు వార లరుగో! స్వచ్ఛందమరణు
లాటలే గాక వశరీర మైనయట్టి
స్వర్గసుఖ మందు రవి పూజ సలుపు టీరు
లోకసంగ్రహణార్థ మానే కదయ్య!

ఎట నేపక్షినిగాని యేమృగమునేని వేయకే పోఁగఁగ
న్నటులేచూచుదయాంబురాసులుగదయ్యా! నీవు నీయన్న యే
మిటికై తాల్చెద రా శరాసనములన్ మీ రట్లు లెల్లప్పు ద
న్నటు లీఘోరవనస్థలీదనుజసంహారం బాకం డుండెగా!

అమితప్రేమరసప్రసన్నను నయోధ్యన్ వీడుటే గాదు త
న్మమతాగంధము పాఱనీయఁ డహహా! మా జానకీజానిప్రే
మ మయ త్యాగమయ స్వధర్మమయ సంసారస్వరూపమ్మె ధ్యే
యము మాకెల్లప్రదల్లదే యొసగు నత్యంతాత్మమాధుర్యముల్.

యమనియమాదులన్ శమదమాకులచేతను జిత్తశాంతి నుం
దమరుచుగాకున్న వీరపురుషాగ్రణి యాటవి యట్టి రాజభో
గమును బరిత్యజించెఁ దృణకల్పముగా నొనరించి వానప్ర
స్థ్యాపునను సామ్రాజ్యమాతపస్కృహాప్రతసిద్ధికి నుద్ది యున్నదే!

పితృవాక్పాలనకై కరస్థ మగు పృథ్వీరాజ్యమెల్లన్ దృణీ
కృతముం జేసినయట్టి యన్న పాదసంప్రీత్యర్థమై యెల్లజీ
విత మెల్లర్పణఁ జేసి విస్మితులఁ గావింతే శిరోధార్య మ
ప్రతిమానమ్ము భవచ్చరిత్ర మసిధారాతీక్ష్ణతీక్ష్ణవ్రతా!

కావించినావు గోదావరీసుఖవాసము
పరిచితస్థలిలోనఁ బర్ణశాల
నమకూర్చినా వాశ్రమముతోడిపాటు సీ
తారామచంద్రవిహారభూమి
నెలకొల్పినావు చిన్నిసరస్సు నొకదాని
నీలోత్పలస్వర్ణనీరజముల
నిలిపినా వొకరమణీయ వృక్షచ్ఛాయ
జానకీరామ విశ్రాంతిపీఠి

మఱపునకుఁ దెచ్చినావు లక్ష్మణకుమార!
అన్నవడి నెలకయ్యయోధ్యాపురమ్ము
నిమ్మహారణ్యమంచు నే యింద్రభోగ
మమర పదవియు స్వర్గసౌఖ్యము ఘటించి

ఏదో రాజ్యము నీకు నీవలయునే యే తెమ్ము సింహాసనం
బారోపింపుము దేవ రాఘవ ధనుర్జ్యారోపితాశీవిష
క్రూరాకారశరమ్ములతో నిలుతు నీకుం బ్రక్కగా నన్న నీ
తీరుం జూచి జగత్త్రయం బదలిపోదే నాఁడు రామానుజా !

సమమై పోయెను క్రోధశాంతులటులన్ సంరంభముం జూపి సం
యమనం బంతటిలోఁ బొనర్చితివి రామాజ్ఞాప్రకారంబుగా
శమితంబై జ్వలదగ్ని చందనముగా సాక్షాత్కృతం బయ్యెఁ బ్రా
ణముద్వైంజమి మంథరాయుతముగన్ గైకేయి కానాఁటికిన్.

గుణ మగుపడ్డ నైజ మనుకొందువు, దుర్గుణ మున్న సుంత నై
రణ మొనరింపనేర వపరాధము దైవతపీతినుండి ల
క్ష్మణ ! డిగకే విచారణను సల్పినచో నరజాతి భూమిపై
మనుటయె దుర్లభంబనఁడె మా రఘురాముఁడు నాఁడు లక్ష్మణా!

హృదయము నెప్పు డూర్ధ్వమునకే పరికించుకి యీ నరత్వమ
న్నది యొకలీలఁ జేయఁ దెలియంటసునే మనుజస్వభావ మా
పదవిని డిగ్గకే పతితపావనుఁడన్ బిరుదంబు రాదు మా
చదు వొక రామచంద్రునికె సర్వము హృద్గతమాయి లక్ష్మణా!

పరులకె కాని దైవ మనుభావము మా రఘురామమూర్తికే
వరుఁడ నటన్న భావమె మనంబున నిత్యాభిమాన మంటనే
నరున కుదారజీవనఘనత్వము నంతె యనుగ్రహించెఁ దా
నెఱుఁగున దైవమేని మను పిన్నను నట్టికృపాసహిష్ణుతల్.

ఎపు డొకకేసుఖంబయి సుఖింపని కావలెన న్నఁగూడఁ గ
ష్టపుఁ జవి యున్నదే కడయఁ జాలని దైవతకోటికన్న నె
ల్లపు డొకదాని నొక్కటిగ నంటుక వచ్చుచుఁబోవు కష్టసౌ
ఖ్యపుఁగలగల్పు గల్గు నరు లన్ననె ప్రీతి జనించు లక్ష్మణా!

కన్నెలు కన్నెలే యగుచుఁ గల్పము లేగినఁగాని తల్లులౌ
టన్నది లేన లేని యపు డందఱు నొక్కటెగాని పెద్దలుం
బిన్నలటంచు లేనపుడు బింబముకుం బ్రతిబింబ మందు లే
కున్నపు డింక స్వర్గ మదియుండియు నేమిఫలమ్ము లక్ష్మణా!

వరుఁడే యాభరతుండు నీయటులనే ప్రాణాధికుండైన సో
దరుఁడే కా రఘురామచంద్రుల కెటుల్ దండెత్తినాఁ డంచు ను
ద్ధురతం జూపితి వల్లనాఁ డెఱుక లేదో నీకు నామూర్తి మ
త్తెఱఁ గెల్లన్ భవదీయ భక్తిగరిమోద్రేకంబె సూచించెడిన్.

నీదియ కాదె రాజ్య మది నే నెటు లేలుదు నేలుఁగాను నీ
పాదుకలే యటన్న భరతుభక్తికినై రఘురాముఁ డెంతొ యా
మోదముఁ జెంద ఖేదమును బొందెద వగ్రజప్రేమ యింక నే
సోదరుఁడేని నీయటులఁ జూరగొనందగఁ డేమి లక్ష్మణా!

అడవికిఁ బాఱఁదోలెఁగద యా సవతమ్మ యయోధ్యనుండి మా
పడసెడి రాజభోగ మెడఁబాపి భళీ! భరతా! యిఁక రామునకుం
గొడుకువ గాఁక పాదుకలుగూడ హరించితి విప్పుడీ వనం
బిడి యనునంతదాఁ కరిగ నేలొకొ నీహృదయంబు లక్ష్మణా!

ఉదయము నిత్య మీవు శిరసొగ్గెడి పాదుకలాటచేత నీ
మది కవి యన్నఁ జాల నభిమానమె యందులకే నటయ్య యీ
వ్యథ తిరుగన్ రచించుకొనవచ్చునె భాగ్యము లేక బంగరో
కొదవయె యియ్యరణ్యమునఁ గొయ్యనునుం గొణతంబు లక్ష్మణా

తొడిగెడు రామపాదుకలఁ దోడ్కొని పోవుచు నీకు మాఱుగా
నిడియెద రాజ్యపీఠి ననఁడే భరతుం డిఁక వీని నింతతో
విడిచితి నే ననండె రఘువీరుఁడు దాఁ దిరుగాడు కొట్టులో
యడు గిడరాని కంటకసమాకుల మివ్వనమంచుఁ గుండితే?

అవి చన నేమి లే తిరుగ నట్టివి వేఱ ధరింపఁబోఁడె రా
ఘువుఁ డని లోన నెంచు నవకాశమె లే నటుకల్గ రాజగా
రవ మిడి యల్లపాదుకల రాముఁ డిడెన్ తనమాఱుగాఁగ న
య్యవియును రామునింబలెనె యప్రతిమానములొక్కొ లక్ష్మణా!

మొదలే తల్లికి వెన్కఁ దల్లిగద వ్యామోహంబునన్ జూచుకొ
న్నదిగాఁ గన్నులఁ గన్నబిడ్డలుగ బాల్యంబాదిగా నన్నఁడే
నెదురే కల్గనివారుగా భరతుఁ డీ శోకంబెకా యేమి యా
డెదమో లక్ష్మణ! కారణార్థమిటులుండెన్ కైకరూపంబుగన్.

ఎక్కడికి నక్కడికె సరిలే య టంచు
నోర్చుకొని యెంత మనసు గుదుర్చుకొన్న
నడవి యనినప్పు డడవియే యగును గాని
యొక్కనాంటికి నేని యయోధ్యగాదు.

సమశీతోష్ణసుఖప్రదంబు బహుసస్యశ్యామలంబుఁ ఫలద్రుమసంశోభిత మైన కోసలమునందుఁ సర్వసంపత్సమృద్ధమయోధ్యాపుర మొప్పుదే ప్రకృతికాంతాగర్భశుక్త్యుత్తమోత్తమముక్తాఫలవైఖరిఁ ధళధళోద్యత్సౌధపారంపరిన్.

వివిధపుష్పోద్యాన విశ్రాంతివేదికా
సుఖవాయుసేవ నోత్సుకజనమ్ము
నవనవోన్మేష సౌందర్యలక్ష్మి రత్న
దర్ప ణోపమిత రథ్యాతలమ్ము
జనపదాగత ధాన్యసంచయ క్రయ వస్తు
సముదాయవిక్రయ సాముగవము
తత్తత్ప్రదేశ నూతననిత్యనిర్మిత
లీలానివాస కేళీవనమ్ము
సకల రాజకీయసంస్థా వ్యవస్థాధి
కారివర్గ ముఖ్యకార్యనిలయ
శతశతాధికమ్ము సాకేతనగరమ్ము
స్మృతిపథమ్ముఁ బాయు టెటులుణమ్మ.

సరయూమాతృక్షీరము
మఱువదయోధ్యాపురీకుమారిక వృద్ధిం
బొరసియు నెప్పటి కపుడే
చిరనూతన మైనయట్టి శిశుసమ్మితమై.

పరిసరోద్యానములలోఁ బ్రభాతములను
వివిధపుష్పోపచయము గావించుపుష్ప
లావికాగీతికలకుఁ దాళములు వేయుఁ
దన్నది సదా తరంగహస్తములతోడ.

తటము నెటు చూడ బ్రాంతకాంతారవాసి
పరమనిష్ఠాగరిష్ఠతపస్వి పాద
చిహ్నముద్రిత మెందు దర్శించినార
లీర లటువంటి పుణ్యవాహినిని తిరిగి.

నదికి రేయి జలక్రీడ నడిపిపోవు
నప్సరోజన దివ్యదేహములనుండి
లులిత మగుచుంటఁ దన్నదీజలము సతము
లలితలలితంబు లాలితలాలితంబు.

ఆయెడ ఘట్టఘట్టవివిధాసనపాళి నిషణ్ణులై త్రయీ
గాయనగాయనీమణులు గాన మొనర్చుచు నుండరే యుష
స్సాయములంగుఁ బ్రత్యుషఃవత్తును గేయముగా నొనర్చి స్వ
ర్గీయపదాతిశాయి యయి కేవలబ్రహ్మపదమ్ము నంటగన్.

ఆముఖ బ్రహ్మతేజము సహస్రముఖంబులఁ గామధేనుచిం
తామణులట్లు శిష్యసముదాయము కాఁకలి దప్పి తీర్ప బో
ధామృత మిచ్చుచుండరె మహామహితాత్ములు మౌనిచంద్రులం
దేమి వచించుచుండినను నీశ్వరవాణి ప్రతిధ్వనింపఁగన్.

ప్రాశన కిన్నియంబువులు పర్ణములున్ ఫలముల్ గదా తపో
రాసులు బ్రహ్మవాదులు పరాశరముఖ్యఋషీంద్రు లీశ్వరా
దేశ మభిస్వరింపరె శ్రుతిస్మృతిరూపము గాఁగ మేఘ గ
ర్జాశతముక్తకంఠముల సర్వము యోగబలమ్మొ వారికిన్.

ఫలమె భుక్తికి నటు గాని పక్షమందు
నట్టి దేదో యపక్వపదార్థ మంతె
యన్యజనమున కే నవధాన్యములను
నేల నెవరేని దున్ని పండించు టెల్ల

అతిథిపూజాపరాయణు లర్చ్యమాన
హరిహరపితామహులు పురుషార్థపరులు
బ్రహ్మతేజఃప్రపూర్ణులై పరిఢవిలరె
యజ్వ లప్పురిఁ ప్రజ్వలితాగ్నులట్లు.

సరయూతీర శిరీషపుష్పవన సంచారం బయోధ్యాపురీ
సురుచిత్వానుభవంబు లో మఱపువచ్చున్ వచ్చినం గాని త
త్పరమామ్నాయ పవిత్ర శీతల వచోధారాభిషేకమ్ముఁ ద
త్పురవాసి ప్రబలానురాగము నొకప్డున్ జ్ఞప్తికిన్ దప్పునే.

మిన్నున్ మన్నును గానరానియటు గ్రమ్మెన్ జిమ్మచీఁకట్లు నా
యన్నా! లక్ష్మణ రాక్షసాదులము ఘోరారణ్యమేగాక యా
సన్నంబైనది కాళరాత్రియును బాషాణంబునం దొంటినే
యున్నావా? యటు పర్ణశాలఁ జొరరాదో నీవ్రతంబాప్పదో.

అదిగో ఘోరతరార్భటుల్ వినుటలేదా? విన్నసేమాయె నం
టవు గాఁబోలును నీమనంబునకు ధ్యానంబందె యున్నావు దా
నవు లేరే యిటు ప్రక్కగా మొదలినంతన్ జేత విల్లందుకొం
దువుగా లక్ష్మణ! డించివేతుగద చిన్మాత్రిద్రన్ సమున్నిద్రతన్.

అటులన్ జూచిన నెంత ఘోరము మనుష్యవ్రాతముంబట్టి తం
టలం బెట్టుచునున్నవా రసురు లీప్రాంతంబునంగూడ నెం
తటిదుర్గంధమొ చుట్టవేసినది నీనాసాపుటంబందె చా
చ్చుట లేకున్నదొ రాముఁ డాజ్ఞ యిడకచ్చో నీవుపో నేరవో.

ఆ ముని పాప మెవ్వఁడొకొ దా! యటు పట్టుక యంటఁదీతు రే
చీమలమట్టి కింకఁబయిఁ జెందుటయా యొడలెల్ల వాఱిలే
గా మఱినెత్తు భైరవులు గ్రమ్ముచునున్నవి కళ్ళు వానియం
దేమియు లేదు దోసమని యీశ్వరచింత యొకండు దక్కగన్.

ఎవఁడొ రక్కసుఁ డేదొ వచించుచుండ
ఖరునితోడుతఁ దోడిరక్కసులు వినఁగ
వింద మొకవేళ మీర లీ విపినమునకు
వచ్చుటాదిగ నడచినవార్త లేమొ.

నరు లొకముర్వ్వి రీమనవనంబును జొచ్చి స్వకీయ మట్టు లే
ర్పఱచుక పర్ణశాల నదె పంచవటిన్ నివసించుచున్న వా
రిరువురు వారిలోఁ బురుషు లింతి యొకర్తుక యెల్లవెంట నొ
క్కరు విడనింక నొక్కరుగఁగాచుచునుందురు వారలాయమన్.

ఎటఁ బొడగట్టువాని నటనే పుటమార్ప వ్రతంబు గొన్నవా
రట! యిటువంటిపాముపగ రాక్షసు లన్నని గాని బాధ నొం
దుట సహియింపనోపరట దోమయుఁ జీమయు నేని యబ్బ! యి
య్యటవిని నేఁటికిన్ వెలసి రన్నయుఁదమ్ముఁడు రామలక్ష్మణుల్.

నరులన ద్వేషభావమున నా వధియించుట పాడుపొట్ట కీ
శ్వరుఁ డటువెట్టిగా మనకు భక్షణ చేయనె చేయరే గదా
పొరిగొన నేటికో మనల బుద్ధిగలార మటంచుఁ జాటుకొం
దురు నరు లంతకంతకు నధోగతిలోఁ బడిపోవుచుండియున్.

పసులవిధమ్మునన్ దనుజభక్షణ కేర్పడువారికిన్ దపో
భ్యసనము వ్యర్థ మంచుఁ గద భంగమొనర్తురు దానదైవ వి
శ్వసనము లే దటంద్రు మునిబాలిశు లట్టులెయైన నేటికే
యసురుల కొక్కలంక నె శివాలయముల్ నవలక్షకోటిగన్.

మృగముల్ పక్షులు మీకు మాకెటులనో మీరే మాకట్టులే
భగవన్నిర్ణయ మన్నఁగాని మదకే పుట్టించుకోబో రనా
దిగ నివచ్చెడిదారి కడ్డుపడి మ్రందింపంగఁ బై పత్తు రీ
విగ నె ట్లీ మరుపద్రవం బడచి స్వామీ! మమ్ము రక్షించెదో!

పొడిచినది చుక్క చీకటు
లడఁగెడి దూరుపదె తెల్లనాయెను జెవులం
బడుచుండె విహాగరుతములు
గుడి వైతాళికుల మేలుకొలుపులు వోలెన్.

ఎదురెదురన్ ధ్వనించు సెలయేటికి నావలికొండ సోల్పునం
దుదయము పక్షిఱెక్కలటులూగుచు వాలుచు నొయ్యనొయ్యలో
నొదుగుచు దూరదూర మగుచుండెడి నీడలఁజూచియన్నయున్
వదినెయు నీవు సూర్యభగవానున కర్ఘ్యము లీయవత్తురే.

* * * *

ఎవ రెవరిఁ గూర్చి శోకిలె
దవు స్వామీ! యవిగొ! యశ్రుధారలచారల్
మివుల మలినమ్ము లొనరిచి
నవి శుద్ధసువర్ణదర్పణకపోలములన్.

మఱిఁ బుత్రవిరహహేతుక
పితృమృతియే గాక దుఃఖపీడితజీవ
న్మృతమాతృశోచనీయ
స్థితియుఁ గలంగించుచున్నదే సౌమిత్రీ!

ఆస్వస్థానమునందు నున్నయెడ జ్యోత్స్నాపూర్ణమీరాత్రిన
ట్లాస్వాదింతో ప్రియాద్వితీయుఁడవుగా నారామదేశమ్మునన్
నాస్వామీ! యెటువంటిరేయి యెటుశూన్యప్రాయమైపోయె న
ర్వస్వమ్ము గృతపాత్రతమ్మునకె ధారం బోసికొంటే ప్రభూ!

ఆయుద్యానసరోజలాంతరితతీరానేకభూమీరుహ
చ్ఛాయాదృశ్యసహోత్సుకప్రియసఖీసంయుక్తనాకావిహా
రాయత్తంబులు పూర్ణిమానిశలు వాయంబోవు చిత్తంబెటుల్
స్వాయత్తీకృత మైన నాయనుభవం బాలాటి దేనాఁటికిన్.

కడచెన్ బూవులపండుగం బటె నదో కాలం బదో జీవితం
బెడ మైపోయెడి నాఁడు నాటి కకటా! యింతేని సంబంధ మే
ర్పడకే వేర్పడుచుండె సుందరదివారాత్రంబు లెన్నెన్నొ యె
క్కడిదీక్షావిధి యిట్టి దింకఁ బదునాల్గా హా! వసంతర్తువుల్.

చూడన్ లేమిర తండ్రివల్కలముటుల్ చుట్టంగఁ గంజాపు లే
నీడల్ వాటెడిమేని కొత్తిడి యగున్ నీ రౌను మాగుండ్రవే
లాడన్ జొచ్చె నవేమి టోయి! తలనీలాలన్ జడల్ గూడ నా
మీదన్ రాదొకొ నీనిసీవ్రతసమాప్తిన్ జేయు పర్యంతమున్.

ఇది పీతాంబరమా? మఱే దయినఁ గానీ హేమచేలంబ? నీ
మది కెట్లొప్పెనొ యెన్నొ యెన్నొ జనకక్ష్మాజాని మున్నెన్న నే
గద మాస్వామికిఁ గట్టబెట్టె మధుపర్కంబుల్ మహార్ఘంబులన్
మదరున్ వల్కలమా వ్రతంబ కరుణాదూరంబ ధర్మంబకే.

కన్నన్ నీకిదు వేళ నాజనకుచేఁ గళ్యాణపీఠమ్మునన్
బన్నీటన్ గడిగించుకొన్నయవి యీ బంగారు పాదమ్ము లీ
కన్నీటన్ గడుగంగఁ జాల మనసాఁ గన్విప్పి తెమ్మెట్లు న
న్నన్నయ్యా! యెపుడున్న వేగదర ధ్యానమ్ముల్ తపోనిష్ఠలున్.

నీ వీరాసనబంధనిశ్చలత ధ్యానింపఁగ ధ్యానింప ము
న్నా వెల్వడ్డవి దుఃఖబాష్పములు గా వానందబాష్పమ్ములన్
భావావిష్టత గల్గెఁగాని యది నీ బ్రహ్మైక్య సంధానమా ?
శ్రీవైకుంఠవిహారమా ! తెలుపుమా ! క్షీరాబ్ధిసంచారమా ?

లోకమ్మున్ మముఁ జూచినవ్వికొనుచున్ లోలోనఁ బువ్వంబెదో
యాకంటం బడ వెల్లడింతువటరా యానందహాసమ్ము నం
తేకాదే యమృతాశ్రువుల్ గురుతువే ఈపువ్వులోకమ్ములన్
నీ కేదో పరిభాష యున్నయటులన్ మీచందమే తెల్పెతే.

పువ్వులుగూడ మోహపడిపోవుచు నీమెయి ద్రావి బంగరుం
బువ్వుల పూజ గూర్చినవి పూర్ణసుధాకరుఁ డిచ్చినాఁడు నీ
కివ్వరమూర్తిమంతునకు నెవ్వఁడొ కప్పురపున్ని వాళి నీ
నవ్వక నవ్వు దృగ్విలసనం బిఁక నైన ననుగ్రహింతువే.

ఎవరో పాపము దేవకాంత యదిగో ! హేలాగతిన్ వచ్చియా
సవడిన్ నీనవకోటిమన్మథవిలాసస్ఫూర్తిమన్మూర్తికిన్
వివశం బైనది లక్ష్మణా ! యొకకృపావీచిన్ బ్రసాదించి తే
ర్చవె ధ్యానస్థితిఁ దెల్లవాఱిచి తదాశాజ్యోతి చల్లార్తువే.

పువుఁబుట్టంబుకఁదోడు కెంజివురుసొమ్ముల్ తీవయొడ్డాణముల్
తవణింపన్ మెయిఁ బాయుటాకునఁ బయంటన్ దీర్చినీ చెంగటన్
సకిలాసంబుగ నిల్చియున్నయది సాక్షాదింద్రచాపంబటుల్
రవ కన్నెత్తిసఁ జాలు నింక సకలస్వర్గసౌఖ్యం బగున్.

తెరచితి గాని కన్ను లటు తీక్ష్ణములైన విలోకనమ్ములం
బఱపెద వేటి కోయి శిశుమానసమూర్తులు గారటోయి యా
సుర లోక నందు సుందరులు శుభ్రహిమమ్ములవంటివారు నీ
వెఱుఁగనివాఁడవా? యెవర వి వనుచున్ నిరసింపఁజూతువా.

కను తెఱచువఱకుఁ దెఱచిన
కను తెఱచినయట్టు లుండఁగాఁ గాచుకొనెన్.
కనికరము లేదె పాపము
వినుచు నదో యాలకింపవే సుమహాత్మా.

సిరి తోఁ బుట్టువుగా జనించిన ఘృతాచీ నామకక్షీరసా
గర రాజేంద్రకుమారి నచ్చరను స్వర్గంగాప్రవాహంబులో
కర ముక్తాఫలము న్నాయత్నకృత రంగద్రంగవల్లీ నిరం
తర సౌభాగ్యమయేంద్రనీలమణి సౌధప్రేంఖికావేదికన్.

పవలున్ రే యనుభేద మెఱుఁగక శుభ్రజ్యోత్స్నతో సర్వకా
ల వసంతోత్సవ నిత్యయావన మహోల్లాసంపు సంపద్ఘనం
బవు స్వర్గంబును వీడఁగావలసె నింద్రాజ్ఞన్ దలన్ దాల్చి నీ
వెవరం చింత తృణీకరించెద వటోయీ! దేవకాంతన్ ననున్.

ఆ ప్రాణప్రతిమా ప్రియావిరహబాధాంతంబు గావించి స్వ
ర్గప్రేమామృతధారలోన నినుఁ బర్యాప్లుతునిం జేసి ని
త్యప్రీతిం బొనరించుచుండుమన నీవా దేవతారక్షణా
ర్థ ప్రాదుర్భవ మాదిశేషునవతారంబంట వింటిం జుమీ.

నట్టువవేళయందునను నాఱొడలన్ ధరియించుకొన్న పూఁ
బుట్టములతోఁ గిసాలయవిభూషలతో నిటు వచ్చి సన్నిధిన్
మెట్టినదానికిన్ దగిన మే లొనఁగూడెను పోయివత్తు నీ
యిట్టికృతిన్ మహేంద్రునికి నెంతటి చిన్నతనమ్మొ చూచితే.

ఇది గంగాజలకేళిఁ దేలి దివిలో నే కల్పకచ్ఛాయనో
మదనారాధనఁ జేయు వేళ సుమి మామా యిష్టసంసిద్ధి క
య్యదనున్ నైత మతిక్రమించెడిని జా గో నేని యంతంతటన్
మది వాహ్యాళికి నైన నందుకొనఁబోదున్ దోడిస్వఃకాంతలన్.

లీలాతాండవ మాపయిన్ జరుగు వాళిన్ దివ్యలావణ్య వ
స్త్రాలంకారధగద్ధగప్రభల దేహాచ్ఛాదనల్ గాఁగ ద
ద్వేళాభంగిమ భంగికాప్రకటనన్ దేవర్షి బ్రహ్మర్షులే
సోలం జొచ్చెద రీ ఘృతాచి ప్రథమస్తోత్రార్హతత్క్రీడలన్.

నరలోకమ్మనకున్ సుదుర్లభము స్వర్ణస్వప్నరూపమ్మ మా
సురలోకమ్ముసుఖమ్మునిన్ వెదకుకొంచున్ వచ్చియున్ వెన్కకున్
మఱలింపంబడుచుండె నేమి నరజన్మం బెట్టి భోగిత్వమే
తెలిఁ గైపోయిన దెంతగా వగచునో దేవేంద్రుఁడీ ధిక్కృతిన్.

నీవు గృహస్థుఁడా పెటులఁగనేరఁడో భంగముకాదొ దేవతా
స్త్రీవిషయమ్మునన్ బరసతీవిముఖవ్రత మింద్రుఁడంపె నా
జ్ఞావిధి వచ్చియున్నయది సన్నిధి కిష్టమెలర్పకుండినన్
బోవును పాప మాగ్రహము పూనకు మేమనుచుంటిలక్ష్మణా!

ఈవు ఘృతాచి వైన మఱి యెవ్వతెవేని పిశాచి వైన నా
క్రేవల నోర్కఁజే యనృతకిల్బిషము౯ సహియింపనోప ని౯
దేవవిభుండు వంచు నెటు దివ్యులతోఁ దివి నున్నవాఁడొ? యా
రావణుచేత లంకను జెఱం బడియుండఁడొకో కృపాకృతీ.

దివిదార్క౯ బనిలేదు పో భువిని ప్రాదేశమ్ము మాత్రమ్ము నీ
వవలం బోయెదె నే ననుజ్ఞ యిడ కావా! యింగితజ్ఞాన శూ
న్యవు నీ వౌటయెగాక యెంత యవమానప్రాప్తునిం జేయుచుం
టివి యయ్యింద్రునిగూడ నేర ననుకొంటే నిన్ను నీపాతము౯.

నిర్యత్నంబుగ వింటి పైకరుగుచుండె౯ జేయి యాశ్చర్య మా
శ్చర్యం బంత సమాధి భంగ మయి యజ్ఞధ్వంసినీతాటకా
చర్యాలాపన బుద్ధి కేర్పడియె నిస్సందేహ మీ వేదాదు
ష్కార్యాలోచనయా నిశాచరివి స్వర్గస్త్రీవె దుర్భాషిణీ.

ఖరజిహ్వాసహితంబుగాఁగ వికృతాకారం బెదో కంటి ముం
దరగా నాడునె నిర్నిమిత్తముగ సంధానమ్ము గావింతునే౯
శరము౯ జాపముకట్టె యొక్కనిముసాన౯ గామరూపమ్ములో
నొఱగు౯ నీనిజరూప మప్పటిసు బాపు౯ దాటక౯ బోలుచు౯.

జీవధనమ్ము దక్కనది స్త్రీవగుట౯ వధియింపఁ జామ్ము నీ
త్రోవను బొమ్ము నీదు కలరూ పెఱిఁగించుక రాకుమీ కుటీ
రావరణమ్ముచాయఁ గలనైనను గాని సహింప నింక నా
యీవిలు నమ్ము లేను సహియించిన ని౯ నరమాంసభక్షిణీ.

నిక్కపు దేవకాంతవలెనే కనుపట్టిన కామరూప మా
రక్కసియా యిదే ఋషిపరంపర నిత్య మెఱుంగఁ జెప్పు నా
ముక్కిడియయ్యె నేనిఁ గడు మోసముతండ్రి! యదేమిరూపమా
ముక్కొకదూలమే యదియ మూలముకో నరవాసనం గొనన్.

ఆశ్రమభూములందు ఋషులాడు మాటయు మాటగూడదూ
రశ్రవణమ్ముఁ జేసి యిది రాక్షసజాతి కెఱుంగఁ దెల్పు నా
విశ్రవసుండు దీని కిడె విద్యను దాని నొరుం డెఱుంగఁ డ
న్యాశ్రయ మింక నీయసురులందున లేనటులన్ విధించుటన్.

పాపిష్ఠురాల కానా
యాపన్నంబలెన యేదో యాడఁగనుంటే
యీవగిది నెందఱెందఱి
నాపొట్టం బెట్టుకొంటి వన్యాయముగన్.

ఏ దురుపద్రవక్రియకో యే నిటు వచ్చినదాన గాను మీ
పాదములాన! మీరలు స్వభావముగాగనె దేవతాప్రియుల్
గాఁదటుచున్ వినంబడును గాన సురాంగనవేష మూనితిన్
గా దన నాకుమాత్ర మిది కావలెనే కరుణింపఁగావలెన్.

ఆబృందారకకోటి సర్వమును మా యంతఃపురీదాసదా
సీబృందం బిఁక నంచ లోకులి ఘృతాచీ దేవదాస్యాకృతిన్
నేఁ బూనన్ మతి నెంతొ సిగ్గిలితి కానీ నీవు గుర్తించి నా
కీబాధన్ దొలఁగించి వైచితివి నీవే యీ మనోదేహముల్.

# పంచవటి

నీ చెలిమిఁ గడింప వావరించుక వచ్చిన నాఘృతాచిపా
త్రోచిత మైనభావ నుపదూఁగ కొనర్చెడివట్ల సర్వమి
థ్యాచరణం బొనర్చితి దయామయు లీర లెఱుంగ లేర పై
పై చెలులాడు ప్రేమ కిఁకఁ బాపము పుణ్యమటన్న శంకయే.

తోడఁ వచ్చి ఫలంబు లేన కొనితెత్తుఁ లేర చేదోడు వా
దోడై యూర్మిళ యూడికడ్డ దనిపింతుఁ జూడరా నఁ గృహం
జూడఁ గావలెగాని యెంత యయినఁ జూపించి సంసారపుం
జాడఁ మాటికి నొక్క క్రొత్తరుచి నాస్వాదింపఁగాఁ జేతురా.

నరమాంసాశన మింతతో విడుతురా నాదైవ మం చెంతురా
చరణం బంటి వచింతురా యొదలివంచ ప్రాణముల్ నీవెరా
పరిచర్యాపర మీయరా వలపు నిల్పఁ శక్యమే గాదురా
కరుణం బోలవురా యొకించుకయినం గానీ తపోధ్యానముల్.

మాయన్న యిడిన నా మాణిక్య గృహమున
నో మోహనా ! మన ముందమింక
దాచుకొందునుర శుద్ధాంతంబునఁ నిను
సౌందర్యమధుకలశంబ రమ్ము
విహారణమ్మునకైన వెడలనీయను జమా
నొంటిగా నే వెనువెంట లేక
చొక్కుదు లేర యీశూర్పణఖాభోగ
లీలామయుండవై లిప్తలిప్త

నాఁడు పుట్టిరి పుట్టి యెందులకుఁ జేద
సీతమఱదివి త్రిభువనజేత యైన
రావణబ్రహ్మ చావమఱంది వగుదు
వెంతలో నెంత గొప్ప యదృష్టరేఖ !

ఓయీ ! యెట్టినిశాచరీహాతక యోఁజించితే దీని యీ
మాయావాగురలన్ దగుల్కొనితపోమాహాత్మ్యముల్ వాసియ
న్యాయంబైరిట నెంద తెందఱో ఋషుల్ నాతండ్రి! యేమేనియున్
బ్రాయశ్చిత్తమొనర్తువే యదెయెదో వాక్రువ్వబో నుంటివే.

సత్యము నొవ్వఁగొంటి నినుఁజంపఁగఁ జే యిఁక రాదుగాని దాం
పత్యముగూడనా మనకుఁ బాతకి! చూచితె యీనరాసుర
వ్యత్యయ మట్టు లుండ వినవైనను నే వినవేర నిట్టి దు
ష్కృత్యపుమాట పావనగృహిన్ బ్రకృతంబుననో వ్రతస్థుడన్.

రోదింపన్ ఫలమేమి నీశ్రవణనిర్యాణంబె యౌఁగావుతన్
నీదూరశ్రవణమ్ముతోడ నిఁక నంతే నీవసింపట్టులే
గాదా ఘ్రాణముగూడఁ జూడు పరమాకాశమ్మునన్ నీదు వ్యా
పాదం బంతయు నీకె యెంతటిభయోత్పాతంబుగా నుండెనో.

సమాప్తము

Printed at Bharathi Press, Tenali P. I. C. No. 36
11th September 1945. 2000 copies.